# ప్రకటన

వ్యాజ్యమునకు సంబంధించిన ముఖ్యాంశములను నిర్ణయించుటకై సమను

సివిల్ ప్రొసీజరుకోడు, ఆర్డరు 5, రూల్సు 1 న్ని 5.

రంగూన్ సిటీ సివిల్ కోర్టులో.

1950 సం.పు సివిల్ రెగ్యులర్ వ్యాజ్యము నెం. 25.

త్యాగల వీరన్న..................వాది.

1 పెడిరెడ్ల సన్యాసమ్మ, లేటు పెడిరెడ్ల సన్యాసిపాత్రుడుగారి భార్య.
2 పెడిరెడ్ల వెంకటరమణ, తల్లియు గార్డియను అయిన సన్యాసమ్మ ద్వారా.
3 కాలంచేసిన పెడిరెడ్ల సన్యాసి పాత్రుడుగారి 8 సంవత్సరములు వయస్సుగల కుమారుడు, తల్లియు గార్డియను అయిన సన్యాసమ్మ ద్వారా.
4 పెడిరెడ్ల చిన్న సన్యాసి పాత్రుడు, కాలంచేసిన సన్యాసి పాత్రుడి గారి సహోదరుడు.
5 పెడిరెడ్ల క్రిష్ణ, పెడిరెడ్ల చిన్న సన్యాసి పాత్రుడుగారి 10 సంవత్సరములు వయస్సుగల మైనరు కుమారుడు, తండ్రియు గార్డియను అయిన పెడిరెడ్ల చిన్న సన్యాసి పాత్రుడుగారి ద్వారా.

పై నుదహరింపబడిన వారందరు కాలం చేసిన పెడిరెడ్ల సన్యాసి పాత్రుడుగారి వారసత్వపు హక్కుదారులు. ప్రతివాదులు.

ప్రతివాదులకు తెలియజేయడమేమనగా:—

మా వద్దనుండి ... పై రావలసిన 5950/- చొప్పున వసూలు చేయుటకై వాది మీపై దావా దాఖలు చేసియున్నందున, 1952 సం. సెప్టెంబరు నెల, 30–వ తేదీ, మంగళవారం, ఉదయం 11 గంటలకు, మీరు స్వయముగా గాని లేక వ్యాజ్యమునకు సంబంధించిన సర్వ విషయములు సవిస్తరముగా తెలియజేయబడి వ్యాజ్యమునకు సంబంధించిన అన్ని ప్రశ్నలకు ప్రత్యుత్తరములు చెప్పగల ఈ కోర్టు అడ్వకేటు లేక ప్లీడరు ద్వారాగా గాని, లేక చట్ట సమ్మతముగా అధికారము పొందిన ఏజంటుద్వారాగాని వాదికి ప్రత్యుత్తరము చెప్పుటకు ఈ కోర్టులో హాజరు కావలయుననియు అట్లు పై నుదహరింపబడిన తేదీని మీరు హాజరుగుటకు తప్పినయెడల, వ్యాజ్యమునకు సంబంధించిన ముఖ్యాంశములు మీ పరోక్షమున నిర్ణయింపబడుననియూ ఇందుమూలముగా మీకు తెలియచేయడమైనది.

మరియు, మీరొక్క ప్రతివాదమునకు ఆధారముగా ఉపయోగించదలచు పత్రములను మీరు స్వయముగాగాని లేక మీయొక్క అడ్వకేటుద్వారాగాని పంపించవలెను. ఈ వ్యాజ్యములో మీరు రిటన్ స్టేటుమెంటు దాఖలుచేయ నెంచినయెడల విచారణకై వాయిదా వేయబడిన తేదీనిగాని లేక దానికి ముందుగాగాని దాఖలు చేయవలెను.

ఈ సమను 1952 వ సం. ఆగస్టు నెల 20 తేదీని, నా సంతకముక్రిందను ఈ కోర్టు ముద్రతోను ఇవ్వబడినది.

ఉత్తరవు ప్రకారము,
"బాన్యర్",
చీఫ్ క్లార్కు.



Edited, Printed & Published by S. Sambha Prasad at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty Street, Madras.

# కాంగ్రెస్‌వాదుల ఐకమత్య ప్రదర్శనము

## ఇందూరు సభపై శ్రీ పాటిల్ అభిప్రాయం

బొంబాయి, సెప్టెంబరు 16: "ఇందూరు ఏ. ఐ. సి. సి. సమావేశము కాంగ్రెసువాదుల క్రమశిక్షణకు, సంఘటిత కాంగ్రెసువాదుల భక్తిప్రపత్తులకు అఖండ విజయము" అని బి. పి. సి. సి. అధ్యక్షుడు శ్రీ ఎస్. కే. పాటిల్ నేడు యిక్కడ ప్రకటించారు. "కాంగ్రెసు సంస్థ విచ్ఛిన్నమవుతుందని కాంగ్రెసు విమర్శకులు చాలామంది ఆశించారు. కాని, ఏ. ఐ. సి. సి. సమావేశంలో కాంగ్రెసువాదులు ప్రదర్శించిన ఐకమత్యము వారి ఆశల నన్నిటినీ భగ్నంచేసింది. యీ విజయానికి ఇందూరులో సమావేశమైన వారందరూ, ముఖ్యంగా పండిత నెహ్రూ కారణభూతులు పండిత నెహ్రూ ప్రదర్శించిన కార్యనిర్వహణ చాతుర్యము, రాజనీతి ప్రశంసనీయములు. ఆయనపైఖరివల్ల ప్రతిపక్షులుగూడా మిత్రులైనారు. సవరించబడిన కాంగ్రెసు నియమ నిబంధనావళి కాంగ్రెసు ఆశయ సాధనకు బలీయమైన సాధన అయింది. కాంగ్రెసు శాసనసభా పక్షనాయకులు పి. సి. సిల అధ్యక్షులు అప్పుడప్పుడు సమావేశమై ప్రజలకు సంబంధించిన సమస్యలను చర్చించాలని కాంగ్రెసు అధ్యక్షుడు త్వరలో ఉత్తరువు చేస్తారని విశ్వసిస్తూ వున్నాను. ఇట్టి సమావేశాలు జరిపే ఆచారాన్ని నెలకొల్పాలి" అని శ్రీ పాటిల్ గారు అన్నారు.

# బెల్గాంలో కమ్యూనిటీ ప్రాజెక్టు కేంద్రం

## ప్రారంభోత్సవానికై స్వామీజీకి పిలుపు

హైదరాబాదు, సెప్టెంబరు 16:— అక్టోబరు 1 వ తేదీనాడు బొంబాయి ప్రభుత్వంవారు బెల్గాంలో ఉపక్రమించబోతున్న కమ్యూనిటీ ప్రాజెక్టు కేంద్రానికి ప్రారంభోత్సవం జరుపుటకు హైదరాబాదు కాంగ్రెసు అధ్యక్షుడు స్వామీ రామానంద తీర్థ గారికి ఆహ్వానం వచ్చింది.

# పాక్-రష్యన్ వస్తు మార్పిడి ఒప్పందం

కరాచీ సెప్టెంబరు 16: పాకిస్థాను రష్యావస్తు మార్పిడి ఒప్పందంపై నేడు సంతకాలు జరిగాయి. ఈ ఒప్పందము ననుసరించి పాకిస్థాను 22 వేలటన్నుల జనపనార, 18,150 టన్నులపత్తి రష్యాకు సప్లయి చేస్తుంది. దీనికి బదులు రష్యా 1,50,000 టన్నుల రష్యా గోధుమలను పాకిస్థానుకు సప్లయి చేస్తుంది. వీరు 60 లక్షుల పౌనుల సరుకును, వారు 60 లక్షలపౌనుల సరుకును సప్లయి చేస్తారు.

## దేవాలయ కదంబవృక్ష మూలానికి వెండి తొడుగు

మధుర, సెప్టెంబరు 15: శ్రీ మీనాక్షి దేవాలయంలో అనేక శతాబ్దాలనుంచివున్న పవిత్ర కదంబవృక్షానికి వెండి తొడుగు వేసేపని నేడు పూజానంతరం ప్రారంభమైంది. ఇందుకోసం శ్రీ అరుణనందితంబిరాన్ స్వామి 1800 రూపాయలు చందా యిచ్చారు. అనేకవందల సంవత్సరాల క్రిందట ఈ దేవాలయాన్ని నిర్మించారు. దేవాలయ నిర్మాణంనాటికే ఈ కదంబవృక్షం అక్కడ వున్నదని అంటున్నారు.

# విద్యుద్ఘాతం వల్ల నలుగురి మరణం

త్రివేంద్రమ్ సెప్టెంబరు16: ఇక్కడికి10 మైళ్ళదూరమునవున్న ఒక పట్టణంలో కొబ్బరిచెట్టునుమహాశక్తివంతమయిన ఎలెక్ట్రిక్ మెయినుమీద పడకుండా ఆపుతూ వుండిన ఒక ఇనపతీగ తెగిపోవడంవల్ల ముగ్గురు ఆడవాళ్లు ఒక శిశువు దుర్మరణం పాలైనారు. ఒక యువకునికి బాగా వొళ్లు కాలింది.

ఆ యువకుడు ఇనప తీగను మరమ్మతు చేస్తున్నాడు. ప్రమాదవశాత్తున ఆ తీగకున్నూ ఎలెక్ట్రిక్ మెయినుకున్నూ సంబంధం యేర్పడి ఆ తీగలోనికి విద్యుచ్ఛక్తి ప్రసరించింది. అతనికి షాక్ కలిగింది. వొళ్లు కాలింది. అతని పోటుని అతని సహాయానికి వచ్చి ఆ తీగల్లో చిక్కుకొని మరణించింది. నిద్రాంతిపోయిన ఆ బాలిక అత్తగారు బాలిక సహాయానికి వచ్చి మరణించింది దగ్గరగా ఒక శిశువును ఎత్తుకొన్న స్త్రీ సహాయం చేయాలనే వుద్దేశ్యంతో అక్కడికి వచ్చి ఆమెకూడా అదే గతి పట్టింది. వొళ్లు కాలిన యువకుడు కోలుకొంటూ వున్నాడు.

# గాలిపటంకోసం కొట్లాట: ఒకనిమరణం

బొంబాయి సెప్టెంబరు 16: నేడు కామాటిపురంలో ఒక గాలిపటం విషయమై ఒక పక్షంవారు, మరియొక పక్షంవారు కలహించి కొట్లాటలోకి దిగారు. కత్తిపోట్ల వల్ల ఒకడు మరణించాడు. ఇద్దరికి తీవ్ర గాయాలు తగిలాయి. 60 మందిని పోలీసు లరెస్టు చేశారు. కలహం జరిగిన ప్రాంతంలో పోలీసులను కాపలా పెట్టారు. ఇప్పుడు వరిస్థితి అదుపులోనికి వచ్చిందని అంటున్నారు.

# దాన ధర్మాలకు వర్తకులు వసూలుచేసే ద్రవ్యం

## రాబడిపన్ను విధించే విషయమై అధికారులకు ఉత్తరువులు

న్యూఢిల్లీ, సెప్టెంబరు 16: దాన ధర్మాలకుగాను వర్తకులు వసూలుచేసే మొత్తంపై రాబడిపన్ను విధించే విషయమున కేంద్ర రెవిన్యూబోర్డువారు పన్ను వసూలుచేసే అధికారులకు వివరంగా వుత్తరువులు జారీ చేశారు. ఈ ఉత్తరువుల ననుసరించి ఈవసూళ్లు నిజముగా దాన ధర్మాలకు వినియోగించడానికి చేసిన వసూళ్ళేనా? అనే విషయాన్ని అధికారులు బాగా తెలుసుకోవాలి. ఈ వసూళ్లను దాన ధర్మాలకు వినియోగించక వర్తకానికి వుపయోగించేటట్లయితే వాటిపైఅధికారులు పన్ను వేయవచ్చును. ఆ సంవత్సరంలోనే ఆ మొత్తమంతా దాన ధర్మాలకు వినియోగం కాలేదనే కారణమున పన్ను విధించగూడదు. 5 ఏండ్లవరకు దాన్ని ఖర్చు పెట్టకుండావుంటే దానిపై పన్ను విధించవచ్చు.

# ఆంధ్ర పోస్టల్ సర్కిల్

## విజయవాడ తంతి తపాలా ఉద్యోగి సంఘ అభ్యర్థన

విజయవాడ, సెప్టెంబరు 16: వెంటనే వార్తు మద్రాసు పోస్టలు సర్కిలును లేదా ఆంధ్రదేశానికి ఒక ప్రత్యేక పబ్ సర్కిలునైనా ఏర్పాటు చేయవలసిందిగా భారత ప్రభుత్వాన్ని కోరుతూ నిన్న సాయంత్రం శ్రీ వై. కోటేశ్వరరావుగారి అధ్యక్షతన జరిగిన తంతితపాలా వర్కర్స్ యూనియన్ విజయవాడశాఖ సప్తమ వార్షికోత్సవ సందర్భంలో ఒక తీర్మానం ఆమోదించబడింది.

శ్రీ కోటేశ్వరరావుగారు ప్రసంగిస్తూ సక్రమమార్గమున పనిచేసే ట్రేడ్ యూనియన్లు చాల అవసరమని, పోస్టలు వర్కర్లంతా యూనియనులో సభ్యులుగా చేరవలసిందిగా కోరారు.

యూనియన్ ఆంధ్రశాఖ ప్రధాన కార్యదర్శి శ్రీ డి.రాములుగారు యింతవరకు ప్రత్యేక పోస్టలు సర్కిలు ఏర్పాటుకై జరిగిన చరిత్రనంతా సమీక్షించారు. పట్టుదలతో కృషి చేసి ప్రత్యేక పోస్టలు సర్కిలును ఏర్పాటు చేయించి తీరాలని సభ్యులంతా ప్రతిజ్ఞ తీసుకోవాలని విజ్ఞప్తిచేశారు. తమ కోరిక నెరవేరాలంటే సభ్యశాఖలు హృదయపూర్వకంగా తోడ్పడాలని అన్నారు.

ఆంధ్రశాఖడెప్యూటీ జనరలు సెక్రటరీ, శ్రీ టి. భావన్నారాయణ, పి. యస్. మూర్తి, టి. యస్. కె. శర్మ, డి. వి. సుబ్బారావు, యస్. శ్రీరామమూర్తి, డి. ఎ. ప్రసాదరావు, పి. యస్. ఆర్. ఆంజనేయులు మొదలగు వారు వెంటనే ప్రత్యేక సర్కిలును ఏర్పరచవలసిన ఆవశ్యకతను గూర్చి, పోస్టలు ఉద్యోగులకు వైద్యసౌకర్యములను గూర్చి మాట్లాడారు.

సూపరింటెండెంటు గారితో బ్రాంచి యూనియన్లు సరాసరి ఉత్తర ప్రత్యుత్తరములు జరుపకూడదని నిషేధిస్తూ 1924 సంవత్సరపు డైరెక్టరు జనరలు ఉత్తర్వు (యీ మధ్య దీనిని అమలులోనికి తీసుకువచ్చారు.) ప్రస్తుత పరిస్థితులకు అనుగుణంగాలేదు. కావున దానిని రద్దు చేయ వలసిందిగాను, బ్రాంచియూనియన్లు సరాసరి సూపరింటెండెంటుగారితో ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుకొన నీయవలసిందిగా కోరుతూ మరొక తీర్మానం చేశారు.

శ్రీ వై. కోటేశ్వరరావుగారు అధ్యక్షులుగా; విజయవాడ పోస్టుమాస్టరు ఉపాధ్యక్షులుగా (ఎక్సు అఫిషియో); పి. నాంచారయ్యగారు కార్యదర్శిగా, వి. యస్. బ్రూస్, సహాయ కార్యదర్శిగా, ఇ. సత్యనారాయణగారు కోశాధికారిగా, యస్. రామారావు గారు సహాయ కోశాధికారిగా, పి. యస్. మూర్తిగారు ఆడిటరుగాను, మరి ఏడుగురు కార్యవర్గసభ్యులుగాను ఎన్నుకోబడిరి.

సభలో రు. 150 వరకు సభ్యులనుండి విరాళాలు ప్రోగు చేయబడినవి. కార్యదర్శి వందన సమర్పణతో సభ ముగిసింది.

# ఏలూరులో ఇద్దరి ఎన్నిక

## 30 స్థానాలకు 88 మంది పోటీ

ఏలూరు, సెప్టెంబరు 11: ఈ పురపాలకసంఘం 32 స్థానాలకూ దాఖలైన 107 నామినేషన్లలో 16 నేడు ఉపసంహరించుకోబడినాయి. ఒకటి నిరాకరింపబడింది. రెండు స్థానాలకు మండూరు వ్యక్తెమ్మ [కాం], దామరాజు వెంకటరావు [స్వ] గారు పోటీ లేకుండా ఎన్నికైనారు. కాగా 30 స్థానాలకు 88 మంది పోటీ చేస్తున్నారు వీటిలో కాంగ్రెసువారు 19, కమ్యూనిస్టు పార్టీవారు 14 స్థానాలకు తమ అభ్యర్థులను నిలబెట్టారు. కమ్యూనిస్టులు మరి 12 స్థానాలలో ఇతరులను బలపరచు చేస్తున్నారు. మిగతా వారు స్వతంత్రులున్నారు. 1, 2, 20, 22, 23, 24, 25, వార్డులలో కాంగ్రెస్ కమ్యూనిస్టు పార్టీలకు ద్విముఖపోటీ జరుగుతున్నది. ఈ వార్డులలో కమ్యూనిస్టేతర పార్టీల సహాయం కాంగ్రెసుకే లభిస్తాయని ఊహిస్తున్నారు.

# ఎకరానికి 53, 45 బస్తాల పంట

## చిత్తూరుజిల్లా కర్షకులకు ప్రభుత్వ బహుమతులు

చిత్తూరు, సెప్టెంబరు 16: ఎకరానికి 53, 45 బస్తాలు వడ్లు పండించిన ఇద్దరు రైతులకు నిన్న ప్రభుత్వం తరపున బహుమతులు ఇవ్వడమైనది. 53 బస్తాలు పండించినవారు చంద్రగిరి తాలూకా కాశిపెంట్ల వాస్తవ్యులు కె. వెంకటరామానాయుడు గారు. 45 బస్తాలు పండించినవారు చిత్తూరు తాలూకా ఎం. ఎల్. ఎ. పి. చిన్నమరెడ్డి గారు.

వీరికి బహుమతులు ఇచ్చేందుకు వ్యవసాయశాఖవారు నేడు కట్టమంచిలో సభ ఏర్పాటు చేశారు, క్షామనివారణ కమీషనరు వి. ఎస్. హేజ్మాడీ గారు సభకు అధ్యక్షత వహించి బహుమతులు పంచిపెట్టారు. నాయుడుగారికి జిల్లా బహుమతి రూ 100 రొక్కం, తాలూకా బహుమతి రూ 50 విలువగల వ్యవసాయపని ముట్లు, ఫిర్కా బహుమతి రూ 25 విలువగల మరొక వస్తువు బహూకరించారు. రెడ్డి గారికి తాలూకా బహుమతి రూ 25 విలువ చేసే వ్యవసాయ పరికరమును బహూకరించారు.

వీరిరువురికిన్ని, హేజ్మాడీ, కలెక్టరు రామచంద్రన్ గార్లకున్నూ పూల మాలలు వేశారు. జిల్లా అధికారులు, నాదముని రెడ్డి, బలరామరెడ్డి ప్రభృతి శాసన సభ్యులు, తదితరులు సభలో పాల్గొన్నారు ప్రార్థనానంతరం జిల్లా వ్యవసాయ శాఖాధికారి ఇ. జి. శివస్వామిగారు నివేదిక చదివారు. బహుమతుల ప్రధానం జరిగాక హేజ్మాడీ కోరిక పైకర్షకులిద్దరూ తాము ఏవిధంగా ఈ ఫలితాలను సాధించిందీ తెలిపారు. రెడ్డిగారు ప్రభుత్వం వ్యవసాయదార్ల కష్టాలను గుర్తించటం లేదని విమర్శించారు. రాష్ట్రమంతటిలో ఈ జిల్లా, ఈ జిల్లాలో ఈ తాలూకా క్షామంవల్ల అనేక కష్టాలకు లోనైనదనీ వీటి నివారణకు ప్రభుత్వం వెంటనే తగు చర్యతీసుకోవాలని అన్నారు. హేజ్మాడీ రెడ్డిగారు తెలిపిన అంశాలను ప్రభుత్వ దృష్టికి తెచ్చి, తన సహాయం చేసేందుకు ప్రయత్నిస్తామన్నారు. (స్వ. వి.)

## రాజమండ్రితాలూకాలో మరొక గంజి కేంద్రము

పనిపాటలు లేక - తిండిలేక మాడిపోతూవున్న కార్మిక కుటుంబముల పోషణార్థము, శ్రీ చిట్టూరి వెంకట దుర్గాప్రసాదరావుగారు - మిత్తిపాడులో దినమునకు నాలు గైదు వందలమందికి అంబలిదానము చేయుటకుగాను ఒక కేంద్రమును తమ స్వంత ఖర్చుతో ప్రారంభించారు. స్వ. వి.

## తిరుపతి వెంకటేశ్వరస్వామి ఉత్సవాలు

తిరుపతి సెప్టెంబరు 16: ఈ నెల 21 వ తేదీ లగాయతూ 29 తేదీవరకు, తిరుమలలో ఉత్సవాలు జరుగుతవి. వీటిల్లో ముఖ్యమైనవి 25 న గరుడోత్సవము, 28 న రథోత్సవం, ఈ సంవత్సరం జనం విశేషంగా రావచ్చుననే ఊహతో, దేవస్థానంవారు తగు ఏర్పాట్లు చేస్తున్నారు. (స్వ. వి.)

## తిరుపతిలో నీటి ఎద్దడి

తిరుపతి: సెప్టెంబరు 16: ఈపట్టణంలో కొలదినెలలుగా నీటి ఎద్దడి తీవ్రంగా ఉన్నది. ఇళ్ళలో బావులందున్న కొద్ది జలంగూడా ఎండిపోయింది. మున్సిపల్ కొళాయిలద్వారా చాలీ చాలకుండానీరు సరఫరా అవుతుంది. మొత్తంమీద పరిస్థితి నడివేసవి కాలంలో వలె ఉంది. త్వరలో పెద్ద వర్షం పడకపోతే, ప్రజల అవస్థమరీ ఘోరంగ తయారవుతుంది. (స్వ. వి)

# ఎన్నిక ముగియకుండానే ఉపఎన్నిక

విజయనగరం, సెప్టెంబరు 14: ఈ పురపాలకసంఘ ఎన్నికలలో 6 వ వార్డుకు నామినేషన్ వేసిన కె. నూర్య రావు గారు చనిపోయినందున ఆవార్డుకు తిరిగి ఎన్నికల తేదీలు ప్రకటించారు. ఈ (9, 22, 23 తేదీలలో నామినేషన్ల స్వీకారం, 24 పరిశీలన, అక్టోబరు 8 సక్రమ నామినేషన్ల ప్రకటన 15, పోలింగు, 16 ఫలిత ప్రకటన. (స్వ.వి.)

## కార్పొరేషన్ సభ్యులకు ముఖ్యమంత్రి విందు

మదరాసు సెప్టెంబరు 17: ముఖ్యమంత్రి శ్రీ సి. రాజగోపాలాచారి అక్టోబరు 1 తేది సాయంత్రం 5-30 లకు రాజాజీ హాలు ఆవరణలో మదరాసు కార్పొరేషనుకు కొత్తగ ఎన్నుకోబడిన కార్పొరేషన్ సభ్యులందరికీ అల్పాహారవిందు ఇస్తున్నారు. విందుకు ప్రభుత్వమంత్రులు, మేయరు ఆల్డర్‌మన్‌లు కూడ హాజరవుతారు.

## అసెంబ్లీ పబ్లిక్ స్కూల్ హైస్కూల్ ట్రస్ట్ వార్షిక మహాసభ

రాష్ట్రంలోని అసెంబ్లీ పబ్లిక్ ప్రాసిక్యూటర్ల నాల్గవ వార్షిక మహాసభ రాబోవు ఆదివారం 21 వ తేదీ ఉదయం 11 గం హైకోర్టు భవనంలో అడ్వకేట్ల సంఘంహాలులో జరుగుతుంది.

## రెండవ మెడికల్ ప్రదర్శనం

స్టాన్లీ మెడికల్ కాలేజి ఆధ్వర్యమున రెండవ మెడికల్ ప్రదర్శన ఉం ప్రారంభోత్సవం రాబోవు శనివారం సాయంత్రం 6 గం కాలేజి భవనంలో ఆర్థికమంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యంగారు జరుపుతారు.

# ముస్లింలీగు-కాంగ్రెసు ఒప్పందం

## కామరాజనాడార్ విమర్శ

మదరాసు, సెప్టెంబర్ 17: మునిసిపల్ ఎన్నికల సందర్భమున ముస్లింలీగు నాయకులకును తమిళ కాంగ్రెసు అధ్యక్షుడు డా॥ పి. సుబ్బరాయన్, తదితర నాయకులకును జరిగిన ఒప్పందము తనకు ఆశ్చర్యము కలుగజేస్తున్నదని యీ ఒప్పంద మునకు అర్థం కావడం లేదని ఆక్షేపిస్తూ తమిళనాడు కాంగ్రెసు మాజీ అధ్యక్షుడు శ్రీ కామరాజ్ నాడార్ గారు యీ నాడు ఒక ప్రకటన గావించియున్నారు.

మునిసిపల్ ఎన్నికలలో ముస్లిం లీగుకు జనాభా దామాషా మేరకు కొన్ని స్థానాలను ప్రత్యేకించే ఒప్పందం తమిళ కాంగ్రెసు అధ్యక్షులతో జరిగినదని ముస్లింలీగు నాయకుడు మహమ్మద్ ఇస్మాయిలు గారు రెండు రోజుల క్రితం గావించిన ప్రకటన తమిళనాడు కాంగ్రెసు నాయకులకు ఆశ్చర్యం కలిగించిందని ఈ దినం ఇక్కడ తెలుస్తోంది.

డా॥ సుబ్బరాయన్ గారికి ఇస్మాయిల్ గారి మధ్య సమాలోచనలు జరుగుతున్న సంగతి తెలిసియున్నప్పటికీ డా॥ సుబ్బరాయన్ గారినిగాని యితర కాంగ్రెసు నాయకులను ఎవరినైనా గాని ఇస్మాయిలు గారు ఆలోచించి వారి అనుమతితో ఈ ప్రకటన చేసినట్లు తోచదని యిక్కడ అధికారరీత్యా తెలుపబడుతోంది. ఒప్పందంగూర్చి ఇస్మాయిల్ గారు తెలిపిన విషయాలుకూడా సరిగా లేవని యీ విషయమై ఒకటి రెండు రోజులలో తమిళ కాంగ్రెసు అధ్యక్షుడు డా॥ పి. సుబ్బరాయన్ గారు స్థితిని విశదపరుస్తూ ఒక ప్రకటన చేస్తారని ఆశింపబడుతోంది.

# తిరుపతిబ్రహ్మోత్సవాలు

## కలరా ఇంజెక్షన్లు పుచ్చుకోవాలని యాత్రికులకు హెచ్చరిక

మద్రాసు సెప్టెంబరు 16: ఈ నెలలో తిరుమల కొండపై జరుగనున్న బ్రహ్మోత్సవాలకు పోదలచుకొన్న యాత్రికులందరు అక్కడ కలరావ్యాధి ఉన్నందున-కలరా ఇంజక్షన్లు పుచ్చుకోవాలని, అలా ఇంజక్షన్లు పుచ్చుకొన్నట్లు సర్టిఫికెట్లను తమ వెంట తీసుకొని వెళ్ళాలని, మద్రాసు ఆరోగ్య శాఖ డైరక్టరు హెచ్చరిస్తున్నారు. జిల్లా అరోగ్యాధికారులు, మున్సిపల్ ఆరోగ్యాధికారులు ఈ ఇంజక్షన్లను, సర్టిఫికెట్లను ఉచితంగా యిస్తారని గూడా వీరు తెలుపుతున్నారు.

## ముఖ్యమంత్రి కార్యక్రమం

మదరాసు, సెప్టెంబరు 17: ముఖ్యమంత్రి శ్రీసి. రాజగోపాలాచారి ఈ నెల 20 వ తేదీ రాత్రి బయలుదేరి కడలూరు వెళ్లి 22 తేదీకి తిరిగివస్తారు.

న్యాయమంత్రి శ్రీకుట్టికృష్ణనాయర్ 24 తేదిన కారులో రాణిపేట వస్తారు. 25 తేదీన వెల్లూరు తిరుమలైపల్లి 26 తేదీ ఉదయానికి తిరిగివస్తారు

రివిన్యూమంత్రి శ్రీ మాణిక్య వేలు నాయకర్, వ్యవసాయమంత్రి డా॥ ఆర్. నాగనగౌడ్ ఇద్దరు కలిసి 22 తేది నుండి 27 తేదీవరకు బళ్ళారిజిల్లాలో పర్యటించి 28 తేదీన మదరాసు చేరుతారు.

## ఎగుమతిలో తగ్గుదల

మద్రాసు, సెప్టెంబరు 17: 1952 జూన్ మాసంలో ఆర్థిక సలహాదారు నిర్ణయించిన సంఖ్యను బట్టి విదేశీ దిగుమతుల విలువ 78 పాయింట్లు పెరిగి 481; విదేశీ దిగుమతుల విలువ 34 పాయింట్లు తగ్గి 455 అయినట్లు కనిపిస్తోంది. తీరం వారీ దిగుమతి విలువ 15 పాయింట్లు తగ్గి 401 గను, ఎగుమతి 57 పాయింట్లు తగ్గి 472 గను వుంది. నిరుడు ఇదేనెలలో విదేశీ దిగుమతి విలువ 396 విదేశీ దిగుమతి విలువ 412 తీరంవారీ దిగుమతులు 509 తీరంవారీ ఎగుమతి విలువ 679 గవుంది.

## స్త్రీల హిందీ విశారద విద్యాలయం

మదరాసు, సెప్టెంబరు 17: ద. భా. హిందీ ప్రచారసభ శిక్షామంత్రి శ్రీ ఎస్. ఆర్. శాస్త్రీనారీలా ప్రాస్తున్నారు:

ఈ నెల 15 తేదీనుండి ప్రత్యేకం స్త్రీల నిమిత్తం హిందీప్రచారసభ రాజాజీ హాస్టలువద్ద హాస్టలు సౌకర్యములతో హిందీ విశారద విద్యాలయం ప్రారంభింపబడింది. సంవత్సరం కోర్సుఅయినందికి నాగరలిపిలోహిందీ బోధనా మాధ్యమిక వుంది. తమిళముగాని, తెలుగుగాని రెండవ భాషగ తీసుకోవాలి. ఆంధ్ర, తమిళ జిల్లాల నుండి హాస్టల్లోవుండి చదివే ఇంకో 15 మంది విద్యార్థినులను చేర్చుకొనుటకు నిశ్చయించబడింది. విద్యార్థినులు హిందీ ప్రవేశిక పరీక్షనుగాని పాస్టు II హిందీలో ఓ. ఎ గాని పాసై యుండాలి. దరఖాస్తు ఫారంను ప్రాస్ పెక్టస్ పత్రికు ప్రాసిన పొందవచ్చును.

## కీ॥ శే॥ దమయంతిబాయి

మద్రాసు, సెప్టెం 17: వాటకచ్చేరీలు, హరికథా కాలక్షేపములలో ప్రసిద్ధికెక్కిన ప్రముఖ విద్వాంసురాలు బాయినారు యీ 14 వ తేదీ రాత్రి చనిపోయారు. ఈమె వయస్సు 75 సంవత్సరాలు. 30 ఏండ్లనుండి పూర్వకాలమున, సెన్నపురిలో యీమె వాటకచ్చేరీలు, హరికథా కాలక్షేపములు నిలిపివారగం ... ఆవిడయ ... గారు. పిఠాపురము సంస్థాన ... పరిషత్ ... యీమె ... చెప్పినది.





## ఉద్యోగవార్తలు:

మదరాసు, సెప్టెంబరు 17: శ్రీ వి. ఆర్. అయ్యర్ అనకాపల్లి వ్యవసాయ పరిశోధన కేంద్ర సూపరింటెండెంటు ను 1952 సెప్టెంబర్ 6 నుండి 8 నెలలు సెలవు మంజూరు చేశారు.

శ్రీ ఆర్. ఎస్. వాసుదేవ ఐ. సి. ఎస్. సెప్టెంబరు 28 నుండి అక్టోబరు 11వరకు కమీషనరులో ప్రభుత్వ పనిని నిర్వహిస్తారు.